# గోలకొండపత్రిక

వృషనామ సం॥ర శ్రావణ బ॥ ౧౮

గురువారము


# విద్యుత్తు విస్తరణ.

ప్రతి నాగరిక దేశములోను ఇప్పుడు విద్యుత్తునుండిచాలాలాభాలు పొందుతున్నారు. విద్యుత్తునాగరికత యొక్క ముఖ్యచిహ్నము. ఆర్థికాభివృద్ధికి ప్రథమ సహాయకారి. మిన సులలో రసాయన ద్రవ్యముద్వారా విద్యుత్తునుత్పత్తి చేయుటయేకాక జలపాతములనుండిసహాయముపొంది అగ్గువగా దాని నుత్పత్తిచేయుటనుకనిపెట్టినారు. మొదట నయాగ్రానదినుండిపడు స్వాభావికజలపాతమును విద్యుత్తుసేవలోనికి తీసుకొనిరి. తర్వాత స్వాభావిక జలపాతాలు లేకున్నను నదుల పారుదలలను గమనించి కృత్రిమజలపాతాలను సృష్టించి వాటిద్వారా పనితీసుకొనుచు వచ్చిరి.

మనహిందూస్థానములో కావేరీ నదినుండి శివసముద్ర జలపాతమును మైసూరు సంస్థానమువారు కల్పించి అచ్చటవిద్యుత్తును సిద్ధముచేసి మైసూరు బెంగుళూరు నగరాలకు అగ్గువగా సప్లైచేయుచున్నారు. అంతటితో ఊరకొనక గెర్సొప్పా అను జలపాతమును గూడావినియోగించుటకై ఏర్పాట్లుచేసినారు. తిరువాన్కూరు సంస్థానంవారును ఇదేవిధముగు పద్ధతిపై విద్యుత్తును సృష్టించు నేర్పాట్లుచేయుచున్నారు.

హైద్రాబాదు రాష్ట్రములోఇంతవరకు జలపాతాలను.డి విద్యుత్తుతీయుటకై ఏర్పాట్లుచేసియుండలేదు. జలపాతాలులేవని కాదు. కొన్ని సహజమైన జలపాతాలున్నవి. అందుప్రఖ్యాతమైనది కోరాపురం (మరపురం) సమీపములో ఉండు కృష్ణాజలపాతము. అది యించుమించు ౪౦౦ అడుగులయెత్తునుండి పడుననియు ప్రపంచములో గణనీయమైన జలపాతమనియు మెడోసు టెయిలర్ గారు తమజీవితచరిత్రలో దానిని చూచి చాలాసుందరముగా వర్ణించియున్నారు. హైద్రాబాదు ప్రభుత్వమువారు ౧౩౪౭ ఫసలీలో అనగా మూడేండ్లకుపూర్వమే జలపాతాలను గురించి ఒక ప్రకటన కావించియుండిరి. నవాబు అహసన్ యార్జంగుగారు ఈ వివరాలనన్నిటిని బాగావిచారించి రాష్ట్రములో ౧౦ జలపాతములను వినియోగించుకొనవచ్చుననియు వాటికై సుమారు ౬౫ కోట్ల రూపాయలు వ్యయమగుననియు, ౫౦ సంవత్సరాలకాలములో ఈపనులనుపూర్తి చేయవలసి యుండుననియు ఒకవిపులనివేదికను ప్రకటించి యుండిరి. అనివేదిక ప్రకారము కడ్డం (గోదావరి) పూర్ణా, మానేరు, పెనుగంగా, పాన్(గోదావరి) ఉత్తరకృష్ణా, నదులవద్ద స్వాభావిక జలపాతాలున్నవని వారు తెలిపిరి. అవికాక తుంగభద్రా, దేవనూరు, నిజాంసాగరు, దక్షిణకృష్ణాలవద్ద జలపాతాలు సృష్టించవచ్చునని అనియు తెలిపిరి.

ఇటీవల వెలువడిన జూలై నెల హైద్రాబాదు సమాచార పత్రికలో "రాజ్యములో జలవిద్యుచ్ఛక్తిని తీయుట" అనువిషయమును గురించి ప్రభుత్వప్రకటన శాఖవారు ఒక వ్యాసమును ప్రకటించినారు. అందు క్రొత్త విషయములులేవు. మేముపైన చూపిన మూడేండ్లనాటి ముచ్చటయే యున్నది. అయితే ఒక విశేషమేమనగా ఇప్పుడీ ప్రణాళికను వీలైనంతవరకు కార్యరూపములో నుంచుటకొరకు సమితి యేర్పాటు చేయబడినది. ఆసమితివారు కార్యారంభము చేసినారనవచ్చును. ఎందుకనగా ౧౦ మొహరు౧౩౫౦ నాడు ప్రకటనశాఖ వారంపిన వార్తనుబట్టి ౫౦ లక్షల వ్యయముతో నిజాంసాగరు ప్రాజెక్టునుండి జలపాతమును సృష్టించి నిజామాబాదు పట్టణానికిని హైద్రాబాదు నకును మధ్యనుండు కొన్ని ప్రదేశాలకు విద్యుత్తును సప్లైచేయుటయేకాక హైద్రాబాదు నగరానికిని విద్యుత్తును సప్లైచేసే యేర్పాట్లు ప్రభుత్వమువారు చేయుచున్నారని ప్రకటించియున్నారు. కాని హైద్రాబాదు సమాచారములోని వ్యాసములో ఇట్లున్నది.

"నిజాంసాగరు ప్రాజెక్టులోవాట్ల శక్తి ౨౫౦౦ జలవిద్యుత్తువల్ల [illegible] ౩ లక్షల ౯౨ వేలు స్కీమునకు అగు మొత్తము ఖర్చు ౨౫ లక్షల రూపాయలు. ప్రతిశత లాభము ౧ [illegible]"

ఈ వార్తలో నిజాంసాగరు ప్రణాళికకు ౨౫ లక్షలే వ్యయమగునని వ్రాసినారు. కాని రెండవ వార్తలో ౫౦ లక్షలగునని వ్రాసినారు. తర్వాత వచ్చిన శాసనముప్రాతశాసనమును రద్దు చేయునన్నట్లుగా తర్వాతి వార్త పాత వార్తను కొట్టివేయును కావున ౫౦ లక్షల వ్యయమే నిజమన్నమాట. పైగా హైద్రాబాదు సమాచారములోని వ్యాసము 3 ఏండ్లనాటి ప్రణాళికనుబట్టి వ్రాయబడినదని స్పష్టమగుచున్నది.

ఏదియెట్లున్నను ప్రభుత్వమువారు ఈ స్కీములను చాలాతొందరగా ప్రారంభించుటఅత్యంత శ్రేయోదాయకము తెలంగాణాకు విద్యుత్తుచాలా లాభకారిగానుండును. తెలంగాణాలోని మోటల బాధతప్పును. పశువుల నష్టము, రైతుల కష్టము, దారిద్ర్యము ఇవన్నియు చాలా వరకు తగ్గిపోవును. నిజామాబాదునుండి హైద్రాబాదు నగర వరకు విద్యుత్తును తెచ్చుటలో మార్గమందలి గ్రామాలవారు కోరినవారికి విధిగా ప్రథమముగా (చవరు రేటుతో) విద్యుత్తును ముఖ్యముగా మోటలకును గృహపరిశ్రమలకును ప్రభుత్వము వారియ్యవలెను. ప్రజలునువిద్యుత్తు లాభమును ఇప్పుడే యెరిగియుండవలెను. ఉదాహరణార్థముగా ఒక్క మోటకుగాను నాలుగు పసువులు ఇద్దరుమనుష్యులు, బొక్కెనలు, తాళ్లు మోటకట్టడములు ౪ వేలు యివన్నియు లెక్క చూచుకొనిన ఒక రైతునకు ఏటేట ౧౦౦ రూపాయీలు వ్యయమైన విద్యుత్తు మూలాన వానికి ౨౦ రూపాయీలకన్న తక్కువకావచ్చును. మోటకై యెంతకాలముపట్టునో అంతకాలములోని ఎనిమిదవవంతు కాలములో పొలానికి విద్యుత్తుద్వారా నీరు పారుచుండును. అదేవిధముగా పల్లెలలోని మగ్గాలను పెట్టుకొను నేతవారు విద్యుత్తుతోనడిచే మగ్గాలు పెట్టుకొనవచ్చును. కంసాలులు బంగారు వెండినీరు పోయుటకు విద్యుత్తును వినియోగించవచ్చును. కమ్మరివారు విద్యుత్తుద్వారా ఇనుపపనులను అవలీలగా చేయగలరు. వడ్లవారు విద్యుత్తుద్వారా కట్టెలను దూలాలను నిముషాలమీద కోసివేయగలరు. పిండి విసరుటకై స్త్రీలు తమకోమలహస్తాలు కాయలుకాచునట్లుగా గొడ్డుకష్టముచేయవలసిన పనిలేదు- విసరించుటకై విద్యుత్తును వినియోగించుకొనవచ్చును. ఈవిధముగా గ్రామజీవితములో నూతన శక్తి చైతన్యమేర్పడును. త్రాగుటకై నీటి పంపులను, రాత్రివెలుతురును, పంఖాలును, గ్రామఫోనులును, రేడియోలును ఇవన్నియుపల్లెలలోనిదొరలు, దేశముఖు దేశపాండ్యాలు, పటేలు పట్వారీలు ధనికులు సాహుకార్లు పెట్టుకొని ఆనందించుటలో తక్కినబీదలు పాల్గొని ఆనందింపవచ్చును.

మన ప్రభుత్వమువారు ప్రారంభించిన నిజాంసాగరు విద్యున్నిర్మాణమునకై వారిని గాఢముగా అభినందించుచున్నాము: ఇదేవిధముగా ప్రతిజిల్లాకును వెంటవెంటనే సౌకర్యాలు కలిగించి తమ ప్రియమైన ప్రజల ననుగ్రహింతురుగాక.

---

### ముస్లింసాలెవారు

హైద్రాబాదు ముస్లింసాలెవారుకొందరు జిన్నాగారితోవారు హైద్రాబాదులోనున్నప్పుడు కలిసిరి. వారు [illegible] చూచి మెచ్చుకొనిరి వారు ఐకమత్యముతో సంఘముగాఏర్పడి తమ అభివృద్ధిమార్గాలను నిర్ణయించుకొనవలెనని బోధచేసిరి.

### పుట్నాలకై కత్తిపోటు

సికింద్రాబాదులో ఒకకల్లుదుకాణంవద్ద బాలోజీఅనువాడు పుట్నాలమ్ముకొనుచుండెను వానివద్ద అబ్దుల్ కరీంఅనువాడు పప్పుకొన్నాడు. పైకంఇయ్యలేదు. ఇద్దరుకొట్లాడినారు. కరీము బాలోజీకడుపులోకత్తితోపొడిచితనకాళ్ళపై తానే కొట్టుకొన్నాడట. ఇద్దరిని వైద్యాలయంలోచేర్చినారు. బాలోజీ ప్రాణాపాయస్థితిలోనున్నాడు.

### ముస్లింవిద్యామహాసభ

ముందుడిసెంబరులో హైద్రాబాదులో అఖిలభారత ముస్లింమహాసభ సర్ మిర్జాఇస్మాయిల్ గారి అధ్యక్షతలోజరుగును.

### హైద్రాబాదుసివిల్ సర్వీస్

హైద్రాబాదు సివిల్ సర్వీస్ కమిటీవారు ఈ క్రింది ౩౦మందిఅభ్యర్థులకుతుదినిర్ణయపరీక్షకు కూర్చుండుటకుగాను సెలవిచ్చిరి. సెప్టెంబరు ౧౯౪౧ లో తుదినిర్ణయమగును.

౧-మ॥ షరీఫ్ హసీబుఖాను. ౨ గులాంగౌసుఖాన్ ౩-మీర్ ముఖ్తదరలీరజ్వీ ౪-మిర్జాఖాసింబేగు ౫-పర్వా వెంకటేశ్వరరావు ౬-[illegible] ౭-మ॥గూరుల్ హసన్ హాషమీ ౮ జలాలుద్దీన్ అహమ్మదు ౯-షాఫీజుద్దీన్ ౧౦-షామీర్ సజ్జతలీఖాన్ ౧౧-లియాఖతమీరా ౧౨-బట్ ౧౩-అ॥ఖాదిర్ ఖాన్ ౧౪-మిర్జాషఫీబేగు [illegible] ౧౫-శ్రీకృష్ణసింహ ౧౬-తవ్వారలీఖాన్ ౧౭ కె॥అలీఅబ్బాస్ ౧౮-మ॥అబ్దుల్ వహీదుఖాన్ ౧౯ మ॥అహ్మదుద్దీన్ సిద్దీఖీ ౨౦ కుంజబిహారీలాల్ ౨౧-మోహన్ లాల్ ౨౨ అమృతలాల్ షా ౨౩-ఫరీదుద్దీన్ ఖాన్ ౨౪-మిర్జామఖ్బూల్ బేగు ౨౫ సయ్యద్ మజఫరుల్లా ౨౬-రఘుపతిరాయ్ శ్రీవత్స ౨౭ మన్జూర్ ముస్తఫా సిద్దీఖీ ౨౮ సి॥ అబ్దుర్రహ్మాన్ ఖాదరీజాఫర్ ౨౯-మ॥అబ్దుల్ అలీ ఖాన్ ౩౦-ఏ.వి.ఎస్-హనుమంతరావుగారలు-

---



## హైదరాబాద్ షాహుకారాన్ వర్కర్స్ కమిటీ

మధిర, ౯-౮-౪౧

రాజాబహద్దుర్ సర్ బన్సీలాల్ మోతీలాల్ గారిగృహమునందు రాజాపన్నాలాల్ లాహోటీగారి అధ్యక్షతక్రింద ౩-౭-౪౧తారీఖున సమావేశము జరిగెను. ఈసభయందుఎనుబైమంది సభ్యులు పాల్గొనిరి, ఆంధ్రజిల్లాలను వి ఆర్యసభ్యులు వచ్చియుండిరి,

హైదరాబాదులోగల వర్తకప్రముఖులకు వైశ్యులెవ్వరును పాల్గొనియుండలేదు, వారికింయాసంఘమునందు పాల్గొనుటకయిష్టము లేకయా? లేక భయపడియా? ఓ వైశ్యయువకులారా! జాతిముఖ్యములలో వర్తకసంఘములుస్థాపించి పైకమిటీలలోపాల్గొని హైదరాబాదువర్తకసంబంధములు బాగుపడుటకు తోడ్పడుటవిశేషము. ప్రపంచవిజ్ఞానమునుజూచుచు ఊరికనే [illegible] చేయుచుఊరకుండుచో వెనకబడినవారమగుదుము, మీరుకూడ వెంటనే హైదరాబాదుసాహుకారాన్ కమిటీలో సభ్యులుగాచేరి దానిభావిఅభివృద్ధికి కారకులగుదురని కోరుచున్నాము. హైదరాబాదునివాసులముప్రత్యేకముగా ఆర్థికమునదివిమనగా, సంకుచితభావములతో మీ సంఘమనభావిఅభివృద్ధికై పాటుపడుదురని నమ్ముచున్నాము. మరియు హైదరాబాదు వ్యాపారమునకు ముఖ్యస్థలమునియు మరియువ్యాపారులందరు ప్రపంచవిజ్ఞానముగలవారని యూహించినమా జిల్లాసభ్యులకు విపరీతమైనఅందోళనగలిగెను.

ఇట్లు

కోనావిశ్వనాథం

---

### శ్రీవైష్ణవ సంఘస్థాపన

హైద్రాబాదు-దక్కన్:

వృష-శ్రావణ బ-౩గురువారం ౫ గంటలకు సాయంకాలము నగరంలో సీతారాంబాగ్ వెనక నవగ్రహాలమందిరంలో శ్రీమాన్ కాండూరు వెంకటరంగాచార్యులగారిభవనమున హైద్రాబాదు సికింద్రాబాదు శ్రీవైష్ణవులందరు సమావేశమయిరి. పంచాంగం వెంకటవరదాచార్యులుగారధ్యక్షతవహించిరి. శ్రీవైష్ణవసంఘస్థాపనావశ్యకతనుగురించి శ్రీమాన్ పంచాంగం వెంకటాచార్యులుగారు శ్రీమాన్ వేదాల రామానుజస్వామిగారు మొదలగువారల ఉపన్యాసముల యనంతరం శ్రీవైష్ణవసంఘము స్థాపింపబడెను,

ఈసంఘమునకు శ్రీమాన్ పంచాంగం వెంకటాచార్యులుగారు అధ్యక్షులుగాను ప్యారక శ్రీరామాచార్యులుగారు కార్యదర్శిగానెన్నుకొనబడిరి,

ఈసంఘపక్షమున నొకగ్రంథాలయమును స్థాపించుటకై తీర్మానించబడెను.

### టాగోరు స్మారకసభలు

గతశుక్రవారము నాడు హైద్రాబాదులో రవీంద్రనాథ స్మారకసభలు ఉమ్మరుదుమహలులోను సుందరభవనములోనుజరిగెను. మొదటిదానికి సరోజినినాయుడుగారు అధ్యక్షతవహించిరి. రెండవదానికి శంకరరావు బూర్గుంకరుగారుఅధ్యక్షతవహించిరి-

### గ్రంథనిషేధం

భాయిపరమానందఅను మరాటీపుస్తకము రాష్ట్రములో నిషిద్ధమైనది-

### 3 లక్షలు నేతకుగాను

హైద్రాబాదురాష్ట్రములో నేతకారవృత్తిం [illegible] వర్షాలులేనందువలనను జిల్లాలలో నేతలకుకొనుటకై తక్కావీనుండి రైతులకు 3 లక్షలరూపాయీలుఇచ్చుటకు ప్రభుత్వమువారు అంగీకరించియున్నారు

---

## విద్యుత్తుయొక్క నిర్మాణము

ప్రభుత్వప్రకటన శాఖవారిట్లు తెలుపుచున్నారు-నిజాంసాగరుచెరువు రాష్ట్రములో నెల్లను పెద్దచెరువు- దానినుండి ౫౦లక్షలఖర్చుచేసి విద్యుత్తు (ఎలక్ట్రిసిటీ) సృష్టించుటకు ప్రభుత్వమువారేర్పాటుచేసినారు- రాష్ట్రములోఅగ్గువగా విద్యుత్తుసప్లయిచేసి పరిశ్రమలవృద్ధికి తోడ్పడుటకు- రాష్ట్రములో విద్యుత్తువ్యయము ఎక్కువైనది- ౧౩౪౯ ఫసలీలో ౧కోటి-౭౪లక్షలయూనిట్లువిద్యుత్తుఖర్చయ్యెను- ఇప్పుడు ౨ కోట్లకంటె యూనిట్లుఖర్చగుచున్నవి. ముందుసంవత్సరము ౨కోట్ల౬౦లక్షలయూనిట్లు ఖర్చగునని అంచనావేయబడినది ౧౦ఏండ్లలో౬కోట్ల ౪౦లక్షలయూనిట్లుఖర్చగునూచనలున్నవి- అయితేఇప్పుడు హైదరాబాదునగరములో ౨కోట్లయూనిట్లుసిద్ధమగుచున్నవి- అందుచేత విద్యుత్తువృద్ధికిగాను ఒకకమిటీఏర్పాటుచేయుమైనది- ఇంతలో ౬౫౦౦ కిలోవాట్ల [illegible] విద్యుత్తు ౨౦ కిలోవాట్లయంత్రాన్ని తెప్పించుచున్నారు- ౧౫౦౦ యంత్రంకూడా తెప్పించబడును. వీటిద్వారావిద్యుత్తు, ౪కోట్ల ౨౦లక్షల యూనిట్లవరకు ఉత్పత్తి కాగలదు.

ఇంతలో నిజాంసాగరులోను విద్యుత్తుసిద్ధము చేయబడును. అప్పటు౨కోట్ల౫౦లక్షల యూనిట్లుఏటేటసిద్ధమగును. అందులోస్థానికముగా వ్యవసాయప్రదేశాలకుసప్లయికాగా హైదరాబాదునగరానికికూడా ౧కోటి [illegible] లక్షలయూనిట్లుసప్లయి కాగలవు-

---

## సర్ మహమ్మద్ జఫరుల్లా ఖాన్ గారు

భారతదేశపు వైస్రాయిగారి కార్యనిర్వాహకవర్గములో సప్లయిశాఖమంత్రియగు సర్ మహమ్మద్ జాఫరుల్లాఖాన్ గారు ఇటీవల సికిందరాబాదుకువచ్చిరి- రైలువద్దవారికి హై-ఎ-సర్ అక్బరు హైదరీగారు, మ-ఖు-వ- నిజాంప్రభుత్వవాణిజ్య, పరిశ్రమలశాఖమంత్రికి సలహాదిచ్చుఅధికారి అయినకల్నల్ ఇ-డబ్ల్యూస్లాటర్ గారు మున్నగువారలు స్వాగతమిచ్చిరి- జాఫరుల్లాఖాన్ గారు ఈపట్టణంలో యుద్ధసామగ్రులను సప్లయిచేయు ముఖ్యకేంద్రములనుదర్శించిరి. వారాయణగూడెములో కత్తులకార్ఖానాను, బేగంపేటలో సైనికదుస్తులకార్ఖానాను, నేనకు మోటారులర్లునడిపే డ్రైవర్లకు శిక్షణమిచ్చేస్థానమును, లోకోషాపులో రుపాకులభాగములను తయారుచేయుచోటిని జాఫరుల్లాఖాన్ గారు దర్శించిరి- కాచిగుడెములో విమానాలకు సంబంధించిన యంత్రములపనులను నేర్పేచోటినికూడ దర్శించిరి-

---

## హైదరాబాదుయుద్ధనిధి

హైదరాబాదు యుద్ధనిధికి ౧౯౪౧ జూలై ౧౮ వతేదివాటివరకుహాలీరూ-౪౬౦౭౫-౧౩-౩ లు, కల్దారు -౭౪౧౮౭-౦-౦లును ఒకసారిచ్చు మొత్తపువిరాళాలుగా చేరియుండెను, మాసికవిరాళాలుగా హాలీ రూ-౧౮౫౦౭-౧౧-౦ లును, కల్దారురూ-౧౧౫౬-౭-౦లును చేరినవి. ౧౯౪౧ జూలై ౧౮ వతేదితర్వాత వచ్చినవిరాళాలుకూడ వీటితోకలుపగా మొత్తము హాలీ రూ-౪౯౫౫౧-౧౪-౧౦ లును, కల్దారు రూ-౮౯౭౦౩-౭-౧ లునుఅయినది- ఇందులోనుండి మొత్తము హాలీరూ-౪౧౦౧౬-౭-౬ లును, కల్దారురూ-౩౭౭౭౬-౬-౩లును ఖర్చుచేయబడినవి మిగిలినవిబ్యాంకులోనున్నది

## సదాశివపేట

ఆర్యసమాజము పై
వ్యతిరేక ప్రచారము

(విలేఖరి) ౫ మెహరు ౧౩౫౦ ఫ.

ఇక్కడి పౌరాణికులు ఆర్యసమాజ ప్రతికూలములగు కొన్ని పుస్తకములు తెప్పించిరి. ఇంకను తెప్పించ ప్రయత్నములు చేయుచున్నారు. తెప్పించిన పుస్తకములు

(౧) "లీడరీపర్ ప్లేగ్" [హిందీ] (౨) "ఆర్యసమాజ్ కీ పోల్. అనునవి. ఇట్టి పుస్తకములు కొందరో అమాయకులలో చదివివినిపించుచు ప్రోత్సహించుచున్నారు. మహర్షి దయానందుడు, మహాత్మాగాంధి, శ్రీజమ్నాదాస్ బజాజ్, శ్రీఘనశ్యామదాసుబిర్లా, శ్రీ పండిత మోహనమాలవ్యాగంటి మహావ్యక్తులనుగురించి అనేక లాంఛితచిహ్నములు వ్రాయబడిన పుస్తకములు తెప్పించి, చదివి ఆర్యసమాజ ప్రతికూలప్రచారము చేయుచున్నారు. సేవయొనర్చి తమధర్మము కాపాడెదమని తలపెట్టియున్నారు.

ఆర్యసమాజ కార్యక్రమము

ఆర్యసమాజ మందిరములో శ్రావణపౌర్ణిమ పర్వము, సత్యాగ్రహ స్మారక బలిదానదివసము జరుపబడెను: ఉదయం౮గంటలకు సదస్యులందరుగూడి హవనప్రార్థన, సంధ్యలు సల్పి, నవీన యజ్ఞోపవీతధారణలు గావించి సత్యాగ్రహబలిదాన స్మారకకలాపము, శిరోమణిసభ, సార్వదేశిక సభ, ఆర్యప్రతినిధిసభల ఆదేశానుసారము సల్పబడెను.

అనంతరము సాయంత్రము ౭ గంటలకు శ్రీ విశ్వనాథ్ గారి అధ్యక్షతలో సభ గావింపబడెను. అందు బలిదానదివసమునుగూర్చియు, అత్మబలులగూర్చియు భజనలు పాడిరి. తర్వాత తద్విషయముపై వ్యాఖ్యానములు, భాషణలు చేయబడెను. శాంతిపాఠముతో సభ విసర్జింపబడెను.

## వాగ్దాన భంగము

మహబూబునగరం, ౧౩-౮-౧౯౪౧:

మహబూబునగరంలో కొందఱు ఆంధ్రప్రముఖవ్యక్తులు ౪-౮-౪౧దివమున రొక్కసభ చేసి తమకుచేరినబీదకుటుంబములకు నెలకొరకుతగినంత దారముతిత్తుమని ఏర్పాటుచేసి అదానమునుంచి చీరలునేసి తమకిచ్చి నైకముతొంది జీవించునట్లు వాగ్దానముచేసిరి. అయితేయిదివరకు ఎలాటిసహాయముచేయక యూరకున్నారు. అందరూచాలాశక్తోయున్నారుగాని నేటివరకువీరుఏలాటిసహాయముచేయరైరి. ఈలాటివారుఎందుకు ముందుకమంతకుతామేవచ్చి బీదలకుఆశ చూపవలయును? ఇందువల్లవీరుచేయురోజామాలిగూడాపోగొట్టుకొని "రాజానమ్మి భర్తనుపోగొట్టుకొన్నట్లు" ఎదురుచూచుచున్నారు. గొప్పవ్యాపార్లకుయిది తగునాఅని శంకించవలసియున్నది.

ఒక బీదసాలె.

## నవాబ్ అక్బర్ హైదరీగారి ప్రశంస

ఈ నెల౯ ౧౦ మెహర్ తేదీలలో కొందరటీపుటుపై పెద్దఅక్షరాలతో రెండుశ్రీముఖాలు ఇరుప గ్రాపకటించబడినవి, వాటిసరియైనభాషాంతరీకరణ యీవిధముగానున్నది. (౧)

"హైదరీసవాబుజంగు ఓరుదవిరాజమానులగు సర్ అక్బర్ హైదరీయొక్క దీర్ఘవిశ్వాసయుక్తసేవలపర్యాలోకనము

ప్రపంచములో ఒకసామెతకలదు, ఏమనగా ఒకవనములో ఒకపేరురెండ్లుపేర్లు ఎక్కువతక్కువలతో తూకమువేసిపోసేరదు. అనగా మొత్తములో లోపమొకలెక్కింపదు ఎందుకంటే ఏమనిషిఅయినా తనలోలోపాలులేవని పూనిచెప్పజాలడు ఆతడట్లుచెప్పుకొనిన అతడుమనిషికాడు గోకతఅగును, అదిఅసంభవము— అందుచేతవిధిబాధితకారణములలో, హైనీయతులలో) ఇతని(న. అక్బర్ హైదరీగారి) కాలములో ఏయేసేవలు కావింపబడినవో అవిఅవశ్యముగా ప్రశంసార్హములైయున్నవి, మరియువాటిని ప్రభువున్నూ మరియుఅతని ప్రభుత్వమున్నూ కృతజ్ఞతోతిలకించుచున్నారు, అందులోఏమిన్నీ అనుమానసందేహాలకు అవకాశములేదు

అదియునుంగాక ఇతనిజీవిత విధానమేదైతేయుండినదోఅదికూడ గుప్తముగానుండినదికాదు, అనగా శిష్టనిష్ఠలరంగును పొందినదై యుండెను— అట్టిసందర్భములలో అతడు విశ్వాసయుక్తుడైన దేశప్రభుసేవకుడుగా నుండెనని చెప్పుటకుతప్పవేరు విధానములేదు—

అతడుతనజీవితములో ఎక్కువభాగము హైదరాబాదులోనే గడపినందునను, మరియుఅతని ఇంటివ్యక్తులు ఇప్పుడుఉద్యోగము చేయుచున్నందునను మరియుఅతనిభార్య (అనగా కే. కే. లేడీ హైదరీ) కూడాఈదేశమందే సమాధిలోపెట్టబడినందునను, మరియుఇతనిపిల్లలుచాలామంది ఇచ్చట నివసించుచున్నందునను, ఈయాశాలను దృష్టిలోనుంచుకొనుచూ, అతడుతన దీర్ఘసంబంధాన్ని త్రెంచుకొనడని తలంపబడుచున్నది. పైగా ఇప్పటివలెనే దానినినిలిపియుంచగలడు. (తనజీవితమువరకు) అనగాఅప్పుడప్పుడు తనఅవసరమైనప్పుడు ఇచ్చటికిరాకపోకలుకలిగి తనవివిధమైన సంబంధాలను ఆనందకరవాతావరణములో మాడగలడు. అదిఅతనికిహృదయానందకారిగా నుండును, అతనికిఇదితప్ప మరిదేనికోరిక బహుశాలేదు. ఇతనికి ఔన్నత్యసౌధచంద్రశాలవరకు పోవు అవకాశములభించెను. దానికైఅతడు అన్నివిధాలా కృతజ్ఞుడైయున్నాడు.

ఇంకేమంటే మేముప్రేమతోఅతనికి పోయిరమ్ము (అల్ విదా) అనిచెప్పుచున్నాము,

"పాతకాన్సిల్ ప్రసిడెంటుకొరకు అర్హమైనఅనుగ్రహము (రియాయత్)" ౧౨రజబ్ ౬ మెహర్) నాటిసు దెక్కన్ పత్రికలో(వ్రాసిన విషయములోని కొంతభాగముబట్టి ఇతనికతీరప్రకృతి బొంబాయినివాసానికొప్పుకొనదు. మరియు అచ్చటిగాలినీరు ఇతనికిసరిపోదు వృద్ధాప్యములో (తనకుగౌరవప్రదమనితలచి ఎక్కడికైతే అనగా రాష్ట్రమువెలుపలికి వెళ్లుచున్నాడో అచ్చటిఉద్యోగమునుండి విరమించుకొన్నతర్వాత) అట్టిస్థితిలో ఇతనికిఇతరులకొరినపక్షములో (తేమనోహరమైనమూలగానున్న) హైదరాబాదులో తనమిగతజీవితమును గడపుకొనుటకు పెలవిమ్మట లో ఏమిన్ని ఆక్షేపణీయములేదని తోచుచున్నది— ముఖ్యంగా ఎవరయితేతమజీవితములో ఎక్కువభాగమును ప్రభుత్వసేవలనునెరవేర్చుటలో గడిపి ముఖ్యఅనుశిర్వచనములో చేరిపోయెనో అట్టివారికి విశ్రాంతితీసుకొను అవసరముకూడాయుండును పైగాఇతనిఆరోగ్యవిధానమునుచూచి ఇతడుతనజీవితములో మిగిలినకొన్నినిమిషాలను దేవునిస్మరణలోవ్యయము చేయవలచినాడని అనిపించుచున్నది. ఇతడుచనిపోయినతర్వాత తన అర్ధాంగిప్రక్కన తనశావును ఇడకుకొను అభిలాషకలవారైయున్నారు.

అన్నివిధాలా దీనిపమయమువచ్చినప్పుడు చూచుకొందునుగాక. దానిపైఇప్పుడు ఆలోచింపనవసరంలేదు, మరేమంటేమేము ఆశించినదేమనగా ఆతడిక్కడనుండి పోవునపుడుఅతనిస్మరణరాష్ట్రవాసులహృదయాలనుండి మాసిపోనేరదు. ముఖ్యంగాపరిపాలకునికిని అతనిప్రభుత్వానికిని. ఇది వేరేమాట,



## శివాలయములో కల్లు దుకాణము

(ఒకవిలేఖరి)

హైదరాబాదు, ౧౧-౧౧-౫౦ ఫ—

హైదరాబాదు సమీపములో యిబ్రాహిం పట్టణమురోడ్డు హైదరాబాదునుంచి పదిమైళ్ళ దూరమున ఇబ్రాహింపట్నం తాలూకాలోచేరిన బ్రాహ్మణపల్లియను ఒక జాగీరుగ్రామంలో ఒక శివాలయము మరియు విష్ణుగోపాలస్వామి దేవాలయములుకలవు, ఇవి అక్కడన్న మాదన్నల సమయములోనిర్మించబడిదేవాలయములు— శివాలయములోని ఆవరణములో కల్లుదుకాణము రెండు సంవత్సరములనుండి పెట్టి అచ్చట కల్లుఅమ్ముచున్నారు ఇప్పుడు నేను మాచినంతలో నాలుగు కుండలకల్లు లో అమ్ముచున్నారు— ఈబ్రాహ్మణపల్లి కల్లుదుకాణంపెట్టుటకు అనువుగూడాలేదు సర్కారిపైవాడు నుండిరేర్పాటు లోనూరిబలో అయియున్నది— రేర్పాటులేని స్థలములలో అమ్మకముచేయుట చాలఆశ్చర్యకరముగా నున్నది— అక్కడిజనులు ఈవిషయముబయటపెట్టుటకుభయపడుచున్నారు— నేనువ్యాపారముకొరకై అక్కడికివెళ్ళియుంటిని. అక్కడ ఒకతాతబోతు నాదగ్గరనిలుచున్న ఒకరైతునుఇక్కడ కల్లు దొరుకగలదాయని యడిగెను. ఆయన్న శివునిగుడిలో దుకాణమున్నది వెళ్లుమనితనకుచెప్పెను— ఆతక్షణం నేనువెళ్ళిచూచితిని. నిశ్చయముగ అక్కడ కల్లుదుకాణముండెను.

## బాలికల ఉన్నతపాఠశాల

(నారాయణగూడము)

[ఒకవిలేఖరి]

హైదరాబాదు—దక్కను, ౧౩-౮-౪౧

ఈరోజు, పాఠశాలాభవనములో ప్రధానమగు హాలు పేరుమానీయుని స్మారకచిహ్నముగా శ్రీ రాజా పన్నాలాలుగారు విశ్వాసించిరో, అట్టి స్మరణీయులగు కీ॥శే॥ రాజాబన్సీలాలుగారి మనుమడు శ్రీయుత మదనలాల్ పిట్టీగారును, వదవరులగు గోవర్ధనలాల్‌గారును శ్రీ రాజాబహద్దరు వెంకటరామారెడ్డిగారిసహితము గా పాఠశాలకుదయచేసిరి— శ్రీవారికి కృతజ్ఞతాసూచకముగా కొకపమాణకముజరుపబడెను— సమావేశకార్యక్రమములో పాఠశాలపరిస్థితులను శ్రీమాడపాటి హనుమంతరావుగారు అభ్యాగతులకువివేదించిరి— శ్రీరాజాబహద్దరు వెంకటరామారెడ్డిగారు రాజాబన్సీలాలుగారి భూరివితరణమునుగొనియాడుచు శ్రీవారివంశమితోధిక విద్యాధనముల నలరారుగాతయని యాశీర్వదించిరి. కృతజ్ఞతావందనములతో మంగళముతో సభముగిసెను.

